శ్రీరస్తు.

# అనుపానమంజరి

## వైద్యశాస్త్రము.

(ఆంధ్రతాత్పర్యసమేతము.)



శ్రీ పువ్వాడ శ్రీగురునాధరావుగారి అనుమతిని

ఉప్పల. వీరన్నశ్రేష్ఠిగారిచే

ప్రకటితము.

చాకలపేట.

చెన్నపురి:

1 6.25.

# విషయసూచిక.



శ్రీరస్తు.

# అనుపానమంజరి.

## ధాతువికారశాన్తి ప్రకరణము.

---

### 1. మంగళాచరణము.

యస్య జ్ఞానమయీమూర్తి స్సచ్చిదానన్దకారిణీ,
తత్పాదపఙ్కజం వన్దే గ్రన్థసంపూర్ణహేతవే.

తా. గ్రంథము నిర్విఘ్నముగ సమాప్తియగుటకు సచ్చిదానంద మూర్తియును, జ్ఞానమయమూర్తియును నగు పరమాత్మపాదకమలములకు వందనమాచరించెదను.

### 2. శపథము.

ధాతో స్తథోపధాతోశ్చ విషం స్థావర జఙ్గమమ్,
తద్వికారస్య శాన్త్యర్థం వక్ష్యేఽనూపానమఞ్జరీమ్. 2
పక్వాఽపక్వస్య ధాతోశ్చ తథా సర్వవిషస్య చ,
సర్వేషాం దోషనాశార్థం కథితం శాస్త్రదర్శిభిః. 3

తా. స్వర్ణాదిసప్తధాతువులును, సప్తోపధాతువులును, స్థావరరూపమగు వృక్ష లతాది విషములును, జంగమరూపమగు సర్పాది విషములును, వీనిచేమానవులకు గలిగెడి వికారముల నుపశమింపఁజేయు విషయములగూర్చి 'అనుపానమంజరి' అను గ్రంథమును నిర్మించెద. మఱియు యథావిధిగఁ జేయం

---

సూచన:—ఈ గ్రంథమునందు కనబడని విషయముల దెలియఁగోరువారు మాచే బ్రకటింపఁబడిన "రసయోగరత్నాకరము" "వైద్యవిధానము"లను పుస్తకముల విలోకింప వలయును.

బడిన సువర్ణాది సప్తధాతువుల భస్మంబులు, ఉపధాతువులు, వీనిచేఁ గలుగు గుణవిశేషంబులను, యథావిధిగఁ జేయఁబడని సువర్ణాది సప్తధాతువుల భస్మంబులును, ఉపధాతువులును, వీనిచేఁ గలుగు దోషంబులకును స్థావరజంగమ విష వికారంబులకును, శాంతులను ఆయుర్వేదానుసారముగ వివరించుచున్నాడను.

### 3. సువర్ణభస్మవికారశాన్తి.

హారీతకీం సితా యుక్తాం యః ఖాదతి దినత్రయమ్,
తస్య సౌవర్ణశాన్తిస్స్యాద్యథాభానూదయే తమః. 4

తా. దోషయుక్తమగు సువర్ణభస్మము సేవించి వికారము జెందినవారి వికారము కరక్కాయ కండచక్కెరలను సమముగ చూర్ణముచేసి మూఁడుదినములు సేవించినచో సూర్యుఁడుదయించినపిమ్మట చీఁకటివలె శమించును.

### 4. రౌప్యభస్మవికారశాన్తి.

మధుచేచ్ఛర్కరాయుక్తం యః ఖాదతి దినత్రయమ్,
పక్వాఽపక్వస్య రౌప్యస్య శాన్తిర్భవతి నిశ్చితమ్. 5

తా. దోషముగల వెండి భస్మ సేవనచే నరుఁడు వికారంబును జెంది కృశించుచుండెనేని, తెల్లచక్కెరలో తేనెకలిపి మూఁడుదినములు సేవించిన బాధ శమించును.

### 5. తామ్రభస్మవికారశాన్తి.

వనవ్రీహీం సితాయుక్తం జలే పిష్ట్వా దినత్రయమ్,
యః పిబే త్ప్రాతరుత్థాయ తామ్రజ స్తస్య నశ్యతి. 6

తా. అడవి ధాన్యముల (నివ్వరి) బియ్యము, కలకండ, వీనిని సమముగా నీటితోనూరి మూఁడుదినంబులు ప్రాతఃకాలములయందు సేవించిన, వికారము నివృత్తియనును.

### 6. నాగభస్మవికారశాన్తి.

హేమాం హారీతకీ యుక్తాం సితాం భక్ష్యే ద్దినత్రయమ్,

సద్యో నాగవికారస్య శాన్తిర్భవతి నిశ్చితమ్. 7

తా. వస, కరక్కాయలు, కలకండలను సమముగా చూర్ణముచేసి మూఁడుదినములు సేవించినచో దోషయుక్తమగు సీసభస్మసేవనచే జనించిన వికారము నివృత్తియగును.

## 7. వఙ్గభస్మవికారశాన్తి.

మేషశృఙ్గీం సితాయుక్తాం యః ఖాదతి దినత్రయమ్,
తస్య వఙ్గనివృత్తిస్స్యాత్తమ శ్చన్ద్రోదయే యథా. 8

తా. వదివేరుపట్ట, కలకండలను సమముగ చూర్ణముచేసి మూఁడుదినంబులు సేవించినచో చంద్రోదయముచే అంధకారము తొలఁగుచందమున దోషయుక్తమగు వంగభస్మసేవనచే జనించిన వికారము నశించును.

## 8. అయోవికారశాన్తి.

సేవితం మధుఖణ్డాభ్యాం త్రుటీచూర్ణం దినత్రయమ్,
అయో వికారశాన్తిస్స్యాత్తిమిరం సాధుసఙ్గమే. 9

తా. కలకండయు, ఏలకులును సమముగ చూర్ణముచేసి తేనెకలిపి మూఁడుదినములు సేవించిన సాధుజన సంగమముచే అజ్ఞానము తొలంగునటులు దోషయుక్తమగు అయోభస్మసేవనచే జనించిన వికారము నశించును.

## 9. త్రిధాతుభస్మవికారశాన్తి.

యః పుమాన్ ప్రాతరుత్థాయ సేవయే త్త్రిఫలాకణమ్,
తస్య త్రిధాతుజా శాన్తి ర్యథా పాపం శివార్చనే. 10

తా. దోషముగల త్రిసంగభస్మమునుసేవించి నరుడు వికారముచే కృశించుచుండెనేని ప్రాతఃకాలంబున * త్రిఫల (కరక, తాణి, ఉసిరిక) చూర్ణంబును సేవింపవలయును. శివార్చనచే పాతకములు తొలఁగునటులు వికారముపోవును.

## 10. లోహభస్మవికారశాన్తి.

సైంధవం త్రివృతా యుక్తం సేవయే త్తప్తవారిణా,

అయోవికారశాన్తిస్స్యాత్పాపం కేశవదర్శనాత్. 11

తా. సైంధవలవణమును, తెల్లతెగడను, సమముగ చూర్ణముచేసి ఉష్ణోదకములో కలిపి సేవించిన, విష్ణుదర్శనముచే పాతకంబులునశించు భంగి, దోషయుక్తమగు లోహభస్మసేవనచే జనించిన వికారము నశించును.

## 11. మండూరవికారశాన్తి.

క్షౌద్రెర్హరీతకీం యుక్తాం యః ఖాదతి దినత్రయమ్,
తస్యమండూరశాన్తిస్స్యాత్స్నానాద్దేహమలంయథా. 12

తా. కరక్కాయల చూర్ణమునకు సమముగ తేనెకలిపి మూడుదినంబులు సేవించినచో స్నానం బొనర్చుటచే దేహము నిర్మలం బగు మాడ్కి దోషయుక్తంబగు మండూర సేవనచే జనించిన వికారము నివృత్తియగును.

## 12. లోహవికారశాన్తి.

దూర్వారసం సమాదాయ మధునా సహ సంపిబేత్,
అయోవికారశాన్తిస్స్యాత్కష్టవ ద్దేవిదర్శనే. 13

తా. గఱికెరసము, తేనె, వీనిని సమముగఁజేర్చి సేవించిన జగదంబను దర్శించుటచే కష్టములు నివృత్తించెడు భంగి, దోషయుక్తమగు లోహభస్మసేవనచే జనించిన వికారము నివృత్తియగును.

శ్వేతదూర్వారసం ధీమాన్ సితోపలయుతం పిబేత్,
తేనకార్ష్ణ్యాయసికా లోహ విషాశ్శాన్తిమవాప్నుయుః. 14

తా. తెల్లగఱికెరసమునకు సమముగ కలకండ చూర్ణమును కలిపి సేవించిన, దోషయుక్తమగు అయోభస్మసేవనచే జనించిన వికారము హరించును.

## 13. ఘోషవికారశాన్తి.

చించాఫలాని పక్వాని జలే పిష్ట్వా పిబేన్నరః,
ఘోషవికారశాన్తిస్స్యా ద్దారిద్ర్యం నిధి దర్శనే. 15

ఇత్యనుపానమఞ్జర్యాం ధాతువికారశాంతి ప్రకరణన్నామ
ప్రథమ స్సముద్దేశః.

తా. చక్కఁగఫలించిన చింతపండును ఉదకంబునవైచి బాగుగ పిసికి పానంబొనర్చిన నిధిని దర్శించుటచే దారిద్ర్యము తొలంగుచాడ్పున దోషయుక్తమగు కంచుభస్మసేవనచే జనించిన వికారము నివృత్తియగును.

ధాతువికారశాన్తిప్రకరణము ముగిసెను.

---

# ఉపధాతువికారశాన్తిప్రకరణము.

## 14. పాదరసవికారశాన్తి.

వికారో యది జాయేత పారదాన్మలసంయుతాత్,
గన్ధకం సేవయేద్ధీమాన్వాచితం విధిపూర్వకమ్. 1

తా. పాదరసమునకు సప్తకంచుకాది దోషంబులు గలవు. అట్టిదోషములు గలపాదరససేవనచే వికారము జనించెనేని శాస్త్రోక్తముగ శుద్ధిజేసిన గంధకసేవనచే వికారము నివృత్తియగును.

గన్ధకం మాషయుగ్మంచ నాగవల్లీదలైస్సహ,
యః ఖాదేత్పారదగ్రస్తస్తద్దోషస్తస్యశామ్యతి. 2

తా. రెండుమాషములప్రమాణము శుద్ధిచేసిన గంధకమును తమలపాకులలో నునిచి ప్రతిదినము సేవించుచుండినచో దోషయుక్తమగుపాదరససేవనచే జనించిన వికారము నశించును.

ద్రాక్షా కూశ్మాండఖండాని తులసీ శతపుష్పికా,
లవంగంనాగకేసంచ గంధకేన సమాంశకమ్. 3

కర్షమాత్రం పయోయుక్తం సర్వమేతత్పృథక్ పృథక్,
సూర్యయోగాంతరా సాధ్యాత్సూతదోషవికార నుత్. 4

తా. ద్రాక్షపండును, బూడిదగుమ్మడుబద్దలును, తులసియు, సోపును, లవంగములును, నాగకేసరములును, సమముగా చూర్ణముచేసి దానికిసమముగ శుద్ధిచేసినగంధకమును గ్రహించి పాలలో రెండుతులములచొప్పున ప్రతిదా

నిని వైచి ప్రాతఃకాలంబున సేవింపుచుండిన దోషయుక్తమగు పాదరస సేవనచే జనించినవికారము నివృత్తియగును.

నాగవల్లీరసం ప్రస్థం భృంగరాజరసం శుభమ్,
తులసీరసప్రస్థంచ ఛాగదుగ్ధం సమాంశకమ్. 5
మర్దితంసర్వగాత్రేషు యామయుగ్మందినత్రయమ్,
స్నానం శీతళనీరేణ సూతదోషప్రశాన్తయే. 6

తా. తమలపాకురసము, గుంటగలగరాకురసము, తులసియాకురసము, మేకపాలు, వీనిని దినుసుకొక్కొక్క ప్రస్థము చొప్పున నేకముచేసి సర్వాంగములకు రెండుజాములపర్యంతము మర్దన జేయించికొని శీతోదకములో స్నానము చేయవలయును. ఇట్లు మూడుదినంబులుచేసిన దోషయుక్తమగు పాదరస సేవనచే జనించిన వికారము శమించును.

## 15. హరితాళవికారశాన్తి.

దాడిమస్యఫలం పక్వం జలం తస్య పిబేన్నరః,
తాళవికారశాన్తిస్స్యా త్పాతకంగురువందనే. 7

తా. చక్కగ ఫలించిన దాడిమవిత్తుల రసమును పానం బొనర్చిన, దోషయుక్తమగు హరితాళకసేవనచే జనించిన వికారము గురువందనముచే పాతకంబులు భస్మంబులగుచందంబున నుపశమించును.

జీరకం శర్కరాయుక్తం సేవయే ద్దినసప్తకమ్,
తాళవికారశాన్తిస్స్యా ద్దారిద్ర్య ముద్యమే యథా. 8

తా. జీలకఱ్ఱ, శర్కర, వీనిని సమముగ నేకముచేసి ఏడుదినంబులు సేవించిన ఉద్యోగమువలన దారిద్ర్యము తొలగుచాడ్పున దోషయుక్తమగు హరితాళక సేవనచే శరీరము కృశించునట్లు చేసెడి వికారము శమించును.

కూశ్మాండస్య రసం దేయం దురాలభాం తథైవచ,
రాజహంసీరసం తావ త్తాలవికృతిశాన్తికృత్. 9

తా. బూడిదగుమ్మడురసమును, చురదగొండివేళ్ళరసమును, చెప్పుత

ట్రాకురసమును సమముగ నేకముచేసి సేవించిన దోషయుక్తమగు హరితాళక సేవనచే జనించిన వికారము నివృత్తియగును.

సువర్ణపుష్ప భూనింబ క్వాథం సేవే ద్దినత్రయమ్,
తాలవికారశాన్తిస్స్యా త్కామశాన్తి ర్యథా స్త్రియా. 10

తా. నల్లఉమ్మెత్తపూలు, లేక ప్రాకుడువేళ్లు, నేలవేము, సమముగ దంచి కషాయముబెట్టి పానముజేసినచో స్త్రీసంభోగముచే కామము శాంతి జెందునటుల దోషయుక్తమగు హరితాళకసేవనచే జనించిన వికారముమానును.

యథా రసవిషం హన్యా ద్గోదుగ్ధేనచ గంధకమ్,
ససితాసర్పాక్షీరస స్తథా తాళవిషం పునః. 11

తా. ఆవుపాలలో శుద్ధిజేసినగంధకమును సేవించుటచే పాదరసదోషంబును, శర్కర, సర్పాక్షీరసములను సమముగ కలిపి సేవించిన హరితాళకజనితదోషముమానును.

## 16. మణిశిలవికారశాన్తి.

క్షీరకం మాక్షికై ర్యుక్తం సేవయే ద్వ్యై దినత్రయమ్,
తస్య వికారం కునటీ నకరోతి కదాచన. 12

తా. ఆవుపాలు, తేనె వీనిని నేకముగఁజేసి మూఁడుదినంబులు సేవించిన దోషయుక్తమగు మణిశిలసేవనచే వికారం బెపుడునుజనింపకయుండును. అనఁగా మణిశిలాసేవన దోషము నివృత్తియగును.

## 17. గంధకవికారశాన్తి.

గవాం పయోఘృతై ర్యుక్తం వలీ వికృతిశాన్తికృత్,
తథైవ దేవకుసుమం వచాయుక్తం చ శాంతికృత్. 13

తా. ఆవుపాలు, నెయ్యి, కలిపి సేవించినను, లవంగములు, వస, చూర్ణముచేసి సేవించినను దోషయుక్తమగు గంధకముచేకలిగిన వికారమునశించును.

## 18. అభ్రకవికారశాన్తి.

ధాత్రీఫలం జలేపిష్ట్వా సేవయేద్వ్యై దినత్రయమ్,

తస్య వికారశాన్తి స్స్యా చ్ఛాభ్రికస్య న సంశయః. 14

తా. ఉసిరికకాయలపరుసుగాని, ఉసిరికాయలనుగాని, నీళ్ళుపోసి దంచి రసముతీసి మూఁడుదినములు సేవించిన దోషయుక్తమగు అభ్రికసేవనచే జనించిన వికారము నివృత్తియగును.

### 19. మాక్షికవికారశాన్తి.

కుళుత్థస్య కషాయేణ మాక్షిదోష ప్రశాంతికృత్,
తథైవ దాడిమత్వంచా దేహస్య సుఖకాంక్షిణః. 15

తా. ఉలవకట్టునైనను, లేక, దాడిమపట్టరసంబునయినను త్రాగినచో మాక్షికసేవనచే జనించిన వికారము నశించును. తేనెయొక్క వికారమును గూడ నివృత్తిచేయును.

### 20. ఇంగిలీకము, శిలాజిత్తుల వికారశాన్తి.

మరిచం ఘృతసంయుక్తం సేవయే ద్దినసప్తకమ్,
తస్య శిలాజితశ్శాన్తి స్తద్వ ద్రక్తస్య శాన్తికృత్. 16

తా. మిరియాలును, నెయ్యి సమముగ నేకముచేసి ఏడుదినంబులుసేవించిన, ఇంగిలీకము, శిలాజిత్తులను దినుటచే గలిగినవికారము నివృత్తియగును.

### 21. కర్పూరవికారశాన్తి.

ధాన్యాకం సితయాయుక్తం వారిమర్దిత పానతః,
కర్పూరస్య నివృత్తిస్స్యా న్మహిషీశకృతం స్తథా. 17

తా. దనియాలను ఉదకముతోనూరి యందు కండచక్కెరకలిపి సేవించినను, లేక బఱ్ఱెపేడరసము త్రాగినను దోషయుక్తమగు కర్పూర సేవనచే జనించిన వికారము నివృత్తియగును.

### 22. తుత్థవికారశాన్తి.

జంబీరరస మాదాయ పిబే ద్య స్త్రిదినం నరః,
తస్య తుత్థకశాంతిస్స్యా త్తద్వ ల్లాజేనవారిణా. 18

తా. నిమ్మపండ్లరసము మూఁడుదినంబులు పానముచేసినను, పరిపేలాలను ఉదకములో చక్కఁగ పిసికి త్రాగినను, దోషయుక్తమగు మైలుతుత్తము, పాలతుత్తము, కళరి సేవనచే జనించిన వికారము తొలంగును.

## 23. మృగాఙ్కవికారశాన్తి.

గవాఘృతం సితాయుక్తం మృగాఙ్కస్యచ శాన్తికృత్,
తథైవ చామ్లకరస స్సద్యోవికృతిశాన్తికృత్. 19

తా. శర్కరలో ఆవునెయ్యికలిపి సేవించినను, ఉసిరికాయల రసమును త్రాగినను, కస్తూరిసేవనచే జనించిన వికారము శీఘ్రముగ నివృత్తియగును.

## 24. నవాసాగర వికారశాన్తి.

గర్దభస్యవిషం భక్ష్యే త్తథైవ నవసాగరమ్,
మృత్తికా గైరికా సీస కాంచత్రుట్యంచ శాన్తికృత్. 20

తా. గాడిదపెంటికలరసమును త్రాగిన శుద్ధిచేయని నవాసాగరము, మృత్తిక, కావిరాయి, అన్నభేది, మొదలగువాని సేవనచే జనించిన వికారములు నివృత్తియగును.

## 25. మౌక్తికాది వికారశాంతి.

ఘృతం మధు సితాయుక్తం గోదుగ్ధేన సమం పిబేత్,
తస్య మౌక్తి ప్రవాళస్య హీరకస్యవిషం హరేత్. 21

ఇత్యనుపానమఞ్జర్యా ముపధాతువికారశాంతిప్రకరణన్నామ
ద్వితీయ స్సముద్దేశః.

తా. నెయ్యి, తేనె, కలకండ, ఆవుపాలు, వీనిని సమముగా నేకము చేసి పానముచేసిన దోషయుక్త మగు ముత్తియములు, పగడములు, వజ్రములు, మొదలగువాని సేవనచే జనించిన వికారములుమానును.

ఉపధాతువికారశాంతిప్రకరణము ముగిసెను.

———

# స్థావరవిషశాన్తిప్రకరణము.

## 26. నాగఫేనవిషవికారశాన్తి.

బృహత్క్షుద్రారసం దుగ్ధం పలమాత్రం నిషేవణాత్,
నాగఫేనవిషంయాతి సజీవతి చిరం పుమాన్. 1

తా. వాకుడురసమును ఆవుపాలలో కలిపి పలప్రమాణముచొప్పున గాని నాలుగుతులముల ప్రమాణముచొప్పున గాని సేవించిన నల్లమందు భక్షణచే జనించిన వికారము నివృత్తియై చిరకాలమువఱకు జీవించియుండును.

ఉగ్రా సింధు స్తథా కృష్ణా వ్యాఘ్రో మదనకః ఫలమ్,
తప్తనీరేణ తద్దేయ మహిఫేనవిషం హరేత్. 2

తా. వస, సైంధవలవణము, పిప్పళ్లు, మంగకాయలు, సమభాగములుగ ఉష్ణోదకముతో నూరి పానముజేసిన నల్లమందుభక్షణచే జనించిన వికారము పోవును.

టంకణం నీలతుత్థంచ ఘృతయుక్తంచ దాపయేత్,
తేన వాంతి ర్భవే త్పద్యో నాగఫేనవిషం త్యజేత్. 3

తా. వెలిగారము, మైలుతుత్తము సమముగ చూర్ణముచేసి యందు నెయ్యికలిపి సేవించిన, వమనంబై నల్లమందు దోషము శీఘ్రముగ నశించును.

## 27. ఉమ్మెత్తవిత్తులవికారశాన్తి.

వృంతాక ఫలబీజస్య రసో ద్విపలమాత్రయా.
భక్షణా ద్భుక్తధుత్తూర విషం నశ్యతి నిశ్చితమ్. 4

తా. వంకాయవిత్తులనైనను, వాకుడువిత్తులనైనను, ఉదకము బోసి నూరి రసముదీసి రెండు పలములు సేవించిన, ఉమ్మెత్తవిత్తుల భక్షణచే జనించిన వికారము నిస్సంశయముగ హరించును.

కార్పాసపుష్పం సితయా జలేనోక్త్వాల్పపానతః,
ధుత్తూరస్య విషం యాతి తథా లవణసేవనాత్. 5

తా. పైడి ప్రత్తిపూలు, కలకండ, యుదకములోనూరి పానముచేసి నను, లవణమును ఉదకములో కలిపి త్రాగినను, ఉమ్మెత్తవిత్తుల భక్షణచే జనించినవికారము నివృత్తియగును.

గోదుగ్ధం ప్రస్థమేకంతు శర్కరాయాః పలద్వయమ్,
తస్యపానా ద్విషంయాతి ధుత్తూరస్యచ నిశ్చితమ్. 6

తా. నాలుగుసేర్ల ఆవుపాలలో రెండుపలముల చీనాచక్కెరకలిపి త్రాగినచో ఉమ్మెత్తవిత్తుల భక్షణచే జనించిన వికారము నిశ్చయముగపోవును.

28. వత్సనాభివికారశాన్తి.

పటూాశనస్యవృక్షస్య రసఃపల ప్రమాణతః,
శర్కరాయుక్తపానేన వత్సనాగవిషం హరేత్. 7

తా. ఒకపలము పటూాశనవృక్ష రసములో శర్కర కలిపి త్రాగినచో నసనాభి భక్షణచే జనించిన వికారము నివృత్తియగును.

29. భల్లాతకవికారశాన్తి.

సర్షపో మేఘనాదశ్చ నవనీత సమన్వితః,
భల్లాతక భవే శోథే హంతి లేపేన దేహినః. 8

తా. ఆవాలు, చిల్లికూర, వెన్న, సమభాగములుగ ఖల్వంబున వైచి చక్కగ మర్దించి, శరీరమునకు లేపనము చేసికొనిన జీడిగింజలచే జనించినవాపు నివృత్తియగును.

దారు సర్షప ముస్తాని నవనీతేన లేపయేత్,
భల్లాతక వికారోయం సద్యోగచ్ఛతి సత్వరమ్. 9

తా. దేవదారు, ఆవాలు, తుంగముస్తెలు సమముగ చూర్ణముచేసి వెన్నకలిపి శరీరమునకు లేపనముచేసికొనిన తోడనే జీడిగింజలచే జనించిన వాపు నివృత్తియగును.

నవనీత తిలా దుగ్ధం పునః ఖండయుతం తథా,
ఏత ద్వయ ప్రలేపేన హంతి భల్లాతక వ్యథామ్. 10

తా. వెన్నయు, నువ్వులునైనను, ఆవుపాలు, కలకండ నైనను, ఏకము చేసి చక్కగనూరి శరీరమునకు లేపనము చేసికొనిన జీడిగింజలచే జనించిన బాధ నివృత్తియగును.

సితయా సహ యామాచ్ఛ మేఘనాదరసస్య చ,
తస్మాద్భల్లం విషం హంతి యథా లింగప్రసేవనాత్. 11

తా. చిల్లీకూర రసములో కలకండ కలిపి త్రాగిన, లింగార్చనచే పాతకంబులు తొలంగుమాడ్కి జీడిగింజలచే జనించిన వికార మొకజాములో పోవును.

30. ఖదిరవికారశాన్తి.

ఖదిరోద్భవం గోపయసా సితాయుక్తం తథైవచ,
యస్సేవయేంద్యామమేకం భల్లంవికృతిశాన్తికృత్. 12

తా. ఆవుపాలలో కలకండకలిపి త్రాగినచో చంద్ర, జీడిగింజ సేవనచే జనించిన వికారము నొకజాములో నివృత్తియగును.

31. తుమ్మెదలకాటుచే జనించు వికారమునకుశాన్తి.

గోదధీశుంఠిసంయుక్తం పానం భృంగీవికారనుత్,
శిఫ స్నపంశజం తద్వజ్జలేపిష్ట్వా పిబేన్నరః. 13

తా. సొంటిని నూరి, ఆవుపెరుగులో కలిపి త్రాగినను, సోపు, పసుపు, ఉదకముచే నూరి త్రాగినను తుమ్మెదలకాటుచే జనించినవికారము నశించును.

32. గురిగింజల వికారశాన్తి.

మేఘనాదరసోగ్రాహ్యం శర్కరాయుక్త పానతః,
ఉచ్చటాయా వికారస్య శాంతిస్స్యాద్దుగ్ధసేవనాత్. 14

తా. చిల్లీకూరరసములో శర్కర కలిపి త్రాగినను, ఆవుపాలుత్రాగినను గురిగింజలవికారము శమించును.

మధు ఖర్జూర మృద్వీకా వృక్షామ్లామ్లాచ దాడిమా,
పరూషైరామలకైశ్చైవ యుక్తా స్సుదోష్యవికారనుత్. 15

తా. తేనె, ఖర్జూరము, ద్రాక్షపండ్లు, పుల్లప్రబ్బలి, చింతపండు, దాడిమపండు, వేరీతపండ్లు, ఉసిరికకాయలరసము సమముగ గలిపి పానముచేసిన గురిగింజభక్షణచే జనించిన వికారము శమించును.

33. పోకలుమొదలగువాని వికారశాన్తి.

పూగీఫలం జడే శీత వస్త్రవాతో హితం భవేత్,
శర్కరాభక్షణే దేయా మధునా శర్కరాన్వితమ్. 16

తా. వక్కలను భక్షించుటచే సొక్కు గలిగెనేని, శీతోదకములో తడిపిన వస్త్రముయొక్క గాలిని సేవించవలయును. మఱియు శర్కరనేని లేక, తేనెలో కలిపిన శర్కరనేని, సేవించవలయును.

34. కోద్రవధాన్య వికారశాన్తి.

కోద్రవాణాం భవేన్మూర్ఛా దేయం క్షీరం సుశీతలమ్,
సగుడః కూశ్మాండకరసో హంతి మద్యసకోద్రవమ్. 17

తా. ఆరికె అన్నమును భుజించినందుచే మూర్ఛకలిగెనేని, అపుడు పితికిన ఆవుపాలనుగాని, బెల్లములో బూడిదె గుమ్మడుకాయరసమును గలిపిగాని, పానము చేసిన వికారము శమించును.

35. గన్నేరువిష వికారశాన్తి.

సితాయుక్తం సదా దేయం దధినా మాహిషం పయః,
తథాచార్కత్వచా పీతం కరవీర విషాపహమ్. 18

తా. కలకండను చూర్ణముజేసి పెరుగు కలిపి పానముచేసినను, బఱ్ఱె పాలలో జిల్లెడువేరుపట్ట కలిపి సేవించినను, గన్నేరువేళ్ళ భక్షణచే జనించిన వికారము శమించును.

36. వజ్రమందారవిషశాన్తి.

శీతవారి సితాయుక్తం పానం వజ్రీవిషాపహమ్,
వస్త్రవాయుస్తథాకార్య శ్శీతచ్ఛాయాంచ సేవయేత్. 19

తా. శీతోదకములో ఖండశర్కరచూర్ణమును కలిపి పానముచేసినను, వస్త్రమూలకముగవచ్చెడి గాలిని సేవించినను, చల్లనినీడయందుండినను, బొంతజెముడుపాలు, జెముడుపాలు; జిల్లెడుపాలు, సేవించుటచే జనించిన వికారము హరించును.

చించాపత్త్రం జలేపిష్ట్వా మర్దయే చ్ఛాంతికృత్సవా,
హిమాద్రిజలపానేన స్నుహీచార్కవికారనుత్. 20

తా. చింతాకును ఉదకముతో నూరి శరీరమునకు మర్దనచేసికొనినను, హిమపత్పర్వతిమందలి జలమును పానము చేసినను, జెముడుపాలు, జిల్లెడుపాలు వీనిసేవనచే జనించిన వికారము శమించును.

### 37. నేపాళవికారశాన్తి.

ధాన్యాకంసితయా యుక్తం దధినాసహ యః పిబేత్,
దంతిబీజవికారస్య నివృత్తి స్తస్య జాయతే. 21

తా. దనియాలు, కలకండ, చక్కెరగానూరి పెరుగులోకలిపి త్రాగిన యెడల శుద్ధిచేయని నేపాళసేవనముచే జనించిన వికారము హరించును.

### 38. విషముష్టి వికారశాన్తి.

ఘృతం మధు సితాయుక్తం సదా పిబతి యో నరః,
విషకోచ వికారస్య శాన్తి స్తస్య ప్రజాయతే. 22

తా. నెయ్యి, కొంచెముగ తేనె,కలకండ, నేకముచేసి ప్రతిదినము సేవించుచుండిన విషముష్టిపండ్ల భక్షణముచే జనించిన వికారము హరించును. (అనగా కలకండ చూర్ణములో నేయి, తేనెగలపి సేవింపవలయుననుట.)

### 39. దుష్టవాతజాదిరోగనివృత్తి.

దుష్టవాతో రవే స్తాపై ర్లూకరోగః ప్రజాయతే,
చించామ్లక సితాక్షౌద్రా ర్దాపయేత్తు పృథగ్జలే. 23

తా. వాయువు సూర్యతాపము వలన లూకరోగము జనించును. అది శమించుటకై చింతపండునైన, సెల్లికాయలరసమునైన, కలకండనైన, తేనె

...సెన, ఉదకములో కలిపి పానము సేయవలయును.

40. శీతలదాహశాన్తి.

మధూదకయుతం పీతం శీతలం దాహనాశనమ్,
నీలికాంచ ఘృతే పిష్ట్వా దేహ లేపేచ శాన్తికృత్. 24

ఇత్యనుపానమఞ్జర్యాం స్థావరవిషశాన్తిప్రకరణనామ
తృతీయ స్సముద్దేశః.

తా. తేనెను శుద్ధోదకములో కలిపి త్రాగినను నీలియాకును నేతితో నూరి శరీరమునకులేపనముచేసికొనినను, శీతలయుక్తమగు దాహము శమించును.

స్థావరవిషశాన్తిప్రకరణము ముగిసెను.

———

## జఙ్గమ విషశాన్తి ప్రకరణము.

41. జఙ్గమ విషశాన్తి.

వంధ్యా కర్కోటికా మూలం ఛాగమూత్రేణ భావితమ్,
నస్యం కాంజిరసం పిష్టం విషోపహత చేతసామ్. 1

తా. గొడ్డుబీరవేళ్ళను మేకమూత్రములోనూరి పుల్లనికలిని కలిపి నస్యముచేసిన జంగమవిషవికారము హరించును.

లజ్జా మూలం కరేబధ్వా విలిప్య సకలం వపుః,
రమతే ఫణిభిస్సార్థం వాతికా ద్గరుడోయథా. 2

తా. లజ్జామూలమును (అత్తపత్తివేరు) ధూపమువేసి బలియొసంగి దానిదెచ్చి రెండు ఖండములుగఁజేసి యందొకదాని సందిటకట్టి మఱియొక్కదానిని గంధముతీసి శరీరమునకు లేపనము చేసికొనిన సర్పాదుల విషంబు లన్నియు హరించును.

42. దంష్ట్రవిషశాన్తి.

త్రిఫలా చందనం కుష్ఠ మూర్ధ్వికం ఘృతసంయుతమ్,



పానలేప సమాయోగో దంష్ట్రిస్య విషనాశకః. 3

తా. త్రిఫలములు, శ్రీగంధము, కోష్టు, అల్లము చూర్ణము చేసి నేతి లోఁ కలిపి పానముచేసినను, శరీరమునకు లేపనముచేసినను, కందురీగ, తేనెటీగ, మొదలగువాని కాటుచే జనించిన వికారము హరించును.

### 43. సర్పాదివిషశాన్తి.

గోజిహ్వా ఫలినీ శక్ర వారుణీ వాత్రిపర్ణికా,
ఏకైకాపానమాత్రేణ సర్పాదిగరలం హరేత్. 4

తా. ఎద్దునాలుకచెట్టు, తరికొట్టు, అగసి, ఎక్కుడుతీగె, వీనిలో దేని రసము నేని పానముచేసిన సర్పములు మొదలగువాని విషములు హరించును.

సరామఠా వచా ఘృష్టా కరబాహుప్రలేపనాత్,
ఘుటసర్ప స్తదాగ్రాహ్యో నదంచతికదాచన. 5

తా. ఇంగువ, వస, ఉదకములోఁ జక్కగనూరి హస్తబాహువులకు చక్కగ లేపనముచేసిన ఘుటసర్పముకాటుచే జనించిన విషదోషము హరించుటయెగాక, మరల నెప్పుడును సర్పదష్టము గలుగదు.

యథా ఖలస్య వైషమ్యా త్పీడితో యాతి సజ్జనః,
తథా వచాయా ధూపేన గృహం ముక్త్వావ్రజేద్గృహీ. 6

తా. గృహమున సర్పమును గాంచుటచే భయముజెందెడి సజ్జనులు ఒకసేరు వసను ధూపమువేసిన వాస్తుసర్పము మొదలగునవి శీఘ్రిముగ పలాయనంబు లగును.

తుత్థంచోగ్రా కామఫలం గోదుగ్ధేనచ పాయయేత్,
తస్మాత్సర్పవిషం యాతి తథోషణఘృతేనచ. 7

తా. మైలుతుత్తము, వస మంగకాయలు తగుమాత్రముగ గ్రహించి యుదకముతోనూరి ఆవుపాలలో కలిపి పానముచేసిన వమనంబై సర్పవిషము హరించును. మఱియు మిరియాలను చూర్ణముచేసి కలిపి యుష్ణముచేసి భక్షించిన సర్పవిషము హరించును.

### 44. శ్వానవిషశాన్తి.

శ్వానస్యాపి విషం హంతి లేపం కుక్కుటవిష్ఠయా,
గుడైస్తైలార్కదుగ్ధైశ్చ లేపశ్శ్వానవిషం హరేత్. 8

తా. కుక్కకఱచిన స్థలంబున కోడిమలము నైనను, బెల్లము, తైలము, జిల్లేడుపాలు, కలిపినదైనను, లేపనము చేయుచుండిన కుక్కకాటు విషముపోవును.

ఉన్మత్తశ్వానదంష్ట్రిణాం కుమారీదళ సైంధవమ్,
సుఖోష్ణాపః పిబేత్పీడా త్రిదినాంతే సుఖావహః. 9

తా. నెయ్యి, కలబందరసము నేకముచేసి కొంచెము వెచ్చచేసి సాంగతలమున కొంచెము సైంధవలవణము కలిపి మూడుదినంబులు ప్రాతస్సాయంకాలంబులయందు త్రాగిన వెఱ్ఱికుక్క కాటు విషము హరించును.

తైలం తిలానాం పలలం గుడంచ క్షీరం తథార్క స్సమ
మేవ పీతమ్, ఆలర్కముగ్రం విషమాశు హంతి సద్యో
భవం వాయురివాభ్రబృందమ్. 10

తా. వెఱ్ఱికుక్కకాటుచే క్షీణించుచుండెడి నరుడు నూనె, నువ్వులచూర్ణము, బెల్లము, జిల్లేడుపాలు నేకముచేసి త్రాగిన విషము హరించును. మఱియు, జిల్లేడుపాలు, జముడుపాలు, తెల్లగడ్డలు, వసనాభి మొదలగువాని సేవనచే దోషము సేవించినందువలన కృశించుచుండెడినరుడు పైని జెప్పిన ద్రవ్యములను శరీరమునకు లేపనముజేసికొనిన నది హరించును.

యత్ర్యాశు కర్కమూలంచ మరిచం కర్షభక్షణాత్.
తద్వ్రణం తత్క్షణాదేవ దహేల్లోహశలాకయా. 11

తా. గుమ్మడువేళ్లు ౨ తులములు, మిరియాలు ౨ తులములు, ఉదకముతో నూరి ముద్దచేసి ప్రతిదినంబును భక్షించుచుండిన వెఱ్ఱికుక్కకాటుచేఁ గలిగిన వ్రణము శీఘ్రముగ మానును. మఱియు, కఱచినస్థలంబున తత్క్షణంబుననే యినుపశలాకతో రక్షలు వేయవలయును.

### 45. దుష్టజంతువికారశాన్తి.

పిష్టం క్రౌంచం జలేఘృష్ట్వా నిత్యం పిబతి యో నరః,

తస్యోధరే దుష్టజంతో ర్విషంనశ్యతి తత్క్షణాత్. 12

క్రౌంచపక్షిమలమును జలముచే నూరి ప్రతిదినము పానము సేయుచుండెడి నరుని దుష్టజంతువులు కఱచినను వానివిషము శీఘ్రముగ నశించును.

### 46. వృశ్చికవిషశాన్తి.

హింగుశ్చార్కపయోఘృష్టో దేయోపరిచదాపయేత్,
వృశ్చికస్య విషంహంతి రజనీం ద్యుపతి ర్యథా. 13

తా. మంచియింగువ, జిల్లేడుపాలు, సమముగనూరి వృశ్చిక దష్టమైన స్థలంబున పదేపదే లేపనము చేయుచుండి సూర్యుఁడు ఉదయించుటచే అంధకారము తొలంగుభంగి వృశ్చికవిషము హరించును.

బాణపుంఖరసో పీతో మేఘనాదరస స్తథా,
శర్కరా సహితం పానం విషం వృశ్చికజం హరేత్. 14

తా. వెంపలిరసము, చిత్రికూరరసము, కలకండ, ఏకముచేసి పానము చేసిన వృశ్చికవిషము హరించును.

### 47. గృహగోధికావిషశాన్తి.

కటుత్రయం సింధు కరంజ బీజం ద్వయం నిశాయాః కపికచ్ఛు బీజమ్, నిహంతి పానేన విలేపనేన విషం సమస్తం గృహగోధికాయాః. 15

తా. సొంటి, పిప్పలి, మిరియాలు, సైంధవలవణము, కానుగవిత్తులు, పసపు, మ్రానిపసపు, దురదగొండివిత్తులు ఉదకముతోనూరి త్రాగినను, లేక లేపనము చేసికొనినను, బల్లి మొదలగువాని విషదోషములు హరించును.

### 48. సరటవిషశాన్తి.

అర్కమూలం వచాచూర్ణం పీతం శీతేనవారిణా,
సరటస్యవిషం సత్య శ్శాంతంభవతి నిశ్చితమ్. 16

తా. జిల్లేడువేరు, వస, చూర్ణముచేసి శీతోదకములో పానముచేసిన తొండకఱచినందుచే జనించిన విషదోషము హరించును.

### 49 మూషకవిషశాన్తి.

సితాయాః పలమానంతు బాణపుంఖరసః ఫలమ్,
యః పిబేత్ప్రాతరుత్థాయ మూషకస్యవిషాపహమ్. 17

తా. రెండుతులముల కలకండలో రెండుతులముల వెంపలిరసముకలిపి ప్రాతఃకాలంబున మేల్కొనినతోడనే త్రాగిన ఎలుకకాటు విషముహరించును.

### 50. శ్వేతమూషక కృతగ్రంధివిషశాన్తి.

ఊర్ధ్వాత్తు పతితం మూషం శ్వేతవర్ణం సుదారుణమ్,
పాతస్థానే భవేద్గ్రంథి స్సగ్రంథిర్మృత్యుదాయికా. 18
శస్త్రేణ గ్రంథిం విస్ఫోట్య ఖరస్య శకృతం క్షిపేత్,
తేన దుష్టస్య గ్రథితో వికృతే శ్శాంతికృ ద్భవేత్. 19

తా. అతిదుష్టమగు శ్వేతమూషకము పైనుండి శరీరముమీఁద పడెనేని యచట గ్రంథులు జనించి మరణంబుగలుగును. కావున గ్రంథులు జనించిన తోడనే వానిని శస్త్రముచేఁ గొంచెముగ గీచి అందు గాడిదపెంటికలను లేపనము చేసిన యాగ్రంథులు శమించును.

### 51. సింహబాలవిషశాన్తి.

మధోశ్చపలమానంతు దినం వింశతి యఃపిబేత్,
తస్యసింహస్య బాలస్య విషం నస్యాత్కదాచన. 20

తా. పూటకు పలప్రమాణము చొప్పున ఇరువదిదినములు తేనెనుపానముజేసిన వ్యాఘ్రరోమజంతువిషము నివృత్తి యగును.

### 52. భ్రమరమక్షికవిషశాన్తి.

మహిషీ నవనీతంచ టంకణై స్సహా మర్ధయేత్,
మాక్షికభ్రామరస్యాంతం నాగఫేనేన తత్సమమ్. 21

తా. బర్రివెన్న, వెలిగారము, సమముగ నేకముచేసి మర్దించి శరీరమునకు లేపనము జేసికొనిన తుమ్మెదలు, అడవియీఁగెలు మొదలగు దుష్టజం

తువుల కాటుచే జనించిన వికారము హరించును. ఈయోగముచే నల్లమందు భుజించుటవలన జనించిన వికారములును కూడ హరించును.

53. కర్ణప్రవేశమైన జోరీగలు మొదలగువానికిశాన్తి.

కర్ణప్రవేశే ఖర్జూర తత్కర్ణే మూత్రకం క్షిపేత్,
తథాచ తిలతైలంచ ధంకేవత్సస్య శ్లథకమ్. 22

తా. గోమూత్రము, మంచినూనె, సేకముజేసి, కొంచెము వెచ్చచేసి యైనను, ఆవుదూడపేడతో రసముతీసియైనను, చెవిలో పోయుచుండిన చెవిలోఁజొచ్చిన జోరీగలు మొదలైనవానిచే జనించు వికారములు హరించును.

జిహ్వయా స్తాలుకాయోగా దమృతంస్రావయేత్తు యత్,
విలిప్తం తేన ధంకస్య నిర్విషం క్షణమాత్రతః 23

తా. అడవియీగలు కరచినస్థలంబునఁ గలిగినదద్దులకు మనుజులయొక్కజొల్లును (ఉమ్మిని) లేపనముజేసిన నవి తోడనే నదృశ్యంబులగును.

54. మూషకాద్యల్పజంతువిషశాన్తి.

భల్లాతర్వర్క ఫలం ముస్తా కపికచ్ఛుఫలం తథా,
రాలసిక్థార్థప తేషాం చూర్ణ ధూపప్రభావతః. 24
మూషకా మశకా మక్షీ మత్కుణా విషకీటకాః,
పలాయంతే గృహం ముక్త్వా యథాయుద్ధేతి కాతరాః. 25

తా. జీడిగింజలు, జిల్లేడుకాయలు, తుంగముస్తెలు, తీటకోవెలకాయలు, యక్షధూపము, తెల్లఆవాలు, చూర్ణముచేసి గృహములో ధూపమువేసిన యుద్ధమున పిరికితనముగలవారు పారిపోవుభంగి ఎలుకలు, దోమలు, ఈఁగలు, నల్లులు, విషజంతువులు పలాయనంబులగును.

అర్కమూలంచ వార్తాకం భావితం సాహ్యగ్నినా సహ,
కటుతైలాక్తదీపస్థాః నిశాయాం మత్కుణాపహాః. 26

తా. జిల్లేడువేరుపట్టను, వంగవేరును, ఎఱ్ఱచిత్రమూలపురసములో భా

నచేసి యం దావనూనెకలిపి దానిలో వత్తినితడిపి రాత్రులయందు దీపము వెలిగించిన నల్లులు నశించును.

### 55. యూకాదిదంశన విషశాన్తి.

శ్రీమూలం గోజలేఘృష్ట్వా దేహాలేపంచకారయేత్,
యూకాచ లీక్షకా సా వా నాశయంత్యపి తత్ర్ క్షణాత్. 27

తా. మారేడువేరును గోమూత్రముతో గంధముతీసి దేహమునకు లేపనము జేసికొనిన పేలు, ఈరు, చీరపేలు మొదలగు సమస్తస్వేదజములు తోడనే నశించును.

శిలాగంధక గోమూత్ర విడంగం కటుతైలతః,
ఏషాం లేపే భవేచ్ఛాంతి స్నానాయూకాచ లీక్షకా. 28

తా. శిలాజిత్తు, గంధకము, వాయువిళంగములు చూర్ణముచేసి అందు గోమూత్రము, ఆవనూనెకలిపి శరీరమునకు లేపనముజేసికొనిన పేలు, ఈరులు, చీరపేలు మొదలగునవి యన్నియు నశించును.

### 56. భ్రమరకృతజలోదరరోగశాన్తి.

షట్పాదే చోదరేప్రాప్తే జలోదరః ప్రజాయతే,
తస్య శుక్తిప్పలీ దేయా కృతే శ్శాంతిక్పృత్సదా. 29

తా. కడుపులో తుమ్మెద ప్రవేశించుటచే జలోదరరోగము జనించును. కావున ప్రత్యహము పిప్పళ్ళు సేవింపుచుండినచో తుమ్మెదలవలన గలిగిన వికారము శమించును.

### 57. సర్వవిషములకు పథ్యాపథ్యములు.

తైలం చామ్లం తథా నిద్రాం వర్జయే ద్విషపీడితః,
తండులం ఘృతదుగ్ధంచ శ్రేష్ఠపథ్యం విషాతురే. 30

తా. నూనె, పులుసు, నిద్ర మొదలగువానిని విషపీడితులు వర్జింపవలయును. బియ్యపుఅన్నము, నెయ్యి, ఆవుపాలు, హితకరంబులు.

ధాతో స్తథోపధాతోశ్చ విషం స్థావరజంగముమ్,

సర్వేషాం వమనం శ్రేష్ఠం విరేకశ్చ తథైవచ. 31

తా. ధాతూపధాతుజనితవిషవికారములకును, స్థావరజంగమాదివిషవికారములకును, వమనవిరేచనముల కీయవలయును.

### 58. సర్వవిషవికారములకు సామాన్యౌషధము.

క్షీరాజాతాధికారేషు సదా దేయంచ భేషజమ్,
సితా మధుఘృతపయ స్తండులం మాహిషం శకృత్. 32

తా. కలకండ, తేనె, నెయ్యి, పాలు, బఱ్ఱెపేడరసము సందిగ్ధవిషములకు హితకరములుగ నుండును.

పృథక్పృథక్సదా దేయం శ్వానస్య చ విషం వినా,
అలర్కే రూక్ష మన్నంచ జలం పశ్చాత్పలాండునా. 33

ఇత్యనుపానమఞ్జర్యాం జఙ్గమవిషశాన్తి ప్రకరణంనామ
చతుర్థ స్సముద్దేశః.

తా. వెఱ్ఱికుక్క విషమునకు తప్ప, తక్కినవిషములకును పైనిజెప్పిన కలకండ మొదలగువానిని వేర్వేరుగ నియ్యవలయును. వెఱ్ఱికుక్క విషమునకు వేడియన్నము, ఎఱ్ఱ ఉల్లిగడ్డలరసము, ఇవి హితకరములుగ నుండును.

జఙ్గమవిషశాన్తిప్రకరణము ముగిసెను.

---

## సప్తధాతూనాం శోధనమారణ రోగానుపాన ప్రకరణము.

అథాత స్సంప్రవక్ష్యామి ధాతూపధాతుమారణమ్,
రోగాణా మనుపానంచ సంక్షేపా త్కథ్యతేఽధునా. 1

తా. ఇంక ధాతువులయొక్కయు, ఉపధాతువులయొక్కయు, మారణంబులను, రోగానుపాన విశేషంబులను, సంక్షేపముగ రచియించుచున్నాను.

### 59. పారదోత్పత్తి.

స్కందాత్తారకహింసార్థం కైలాసే ప్రార్థితస్సురైః,
కరుణాత్మా మహాదేవః పార్వతీవల్లభశ్శివః. 2
రతౌ శ్శంభోశ్చ్యుతం రేతో గృహీతం వహ్నినాముఖే,
క్షిప్తం తేన చతుర్థిక్షు మాయాంత త్తత్పృథక్పృథక్. 3
సౌమ్యాదిదిక్త్రయస్యాంతే గౌరీశాపా న్న కార్యకృత్,
పశ్చిమాయాంతు యత్క్షిప్తం సదిశత్సర్వకార్యకృత్. 4
ఏషోత్పత్తి స్సమాఖ్యాతా పారదస్య మనీషిభిః,

తా. తారకాసురవధార్థమై కార్తికేయుని జనింపఁజేయుసలయునని కరుణాత్ముండును, పార్వతీవల్లభుండును నగునీశ్వరుని దేవేంద్రాది సమస్తదేవతలు ప్రార్థించిన నతండు కార్తికేయజననిమిత్తమై పార్వతితో సంయోగము జేయునెడ వీర్యము పతనంబయ్యె దానిని అగ్ని గ్రహించి ధరింపశక్యముగాక భూమియందువిడువఁగా నది నలుదిక్కులయందు వ్యాపించెను. ఉత్తరదిశయందు పడినరసము గౌరీశాపముచే నిష్ఫలంబగుటంజేసి యది యేకార్యమందు నుపయోగింపదనియు, పశ్చిమ దిశయందు పడినరసము సమస్తకార్యములకు నుపయోగించుననియు, ఆయుర్వేదవేత్తలు సూచించెదరు.

### 60. పాదరసవర్ణభేదములు.

శ్వేతవర్ణో ద్విజస్ప్రోక్తో రక్తః క్షత్రియసంజ్ఞకః. 5
పీతవర్ణోథ వైశ్యః కృష్ణస్స్యా చ్ఛూద్రజాతయః,

తా. తెలుపువర్ణముగలరసము బ్రహ్మజాతియనియు, ఎఱుపువర్ణముగలరసము క్షత్రియజాతియనియు, పచ్చనివర్ణముగలరసము వైశ్యజాతియనియు, నలుపువర్ణముగలరసము శూద్రజాతియనియుఁ జెప్పఁబడుచున్నది.

నాగో వంగో మలో వహ్ని శ్చాంచల్యంచ విషం గిరిః. 6
అసహ్యాగ్ని ర్మహాదోషా స్స్వభావా త్పారదే స్థితాః,

తా. పాదరసమున స్వాభావికముగ నాగ, వంగ, గిరి, అసహాగ్ని, మొ

దలగు మహాదోషంబులుగలవు. వానిని నివారించుటకై అష్టాదశసంస్కారము లను జేయవలయును.

### 61. పాదరసగుణము.

సూతష్షడ్రసయుక్త్రిదోషశమన స్సర్వామయధ్వంసకృత్
కాంతా కామవివర్ధ నోతి బలకృత్సర్వార్ధి సుధాయా శ్శివః,
చక్షుష్యస్స్మృతిరూపదోమరణహృద్వార్ధకశ్యజిద్వృద్ధికృత్
జాడ్యఘ్నం క్రిమికుష్ఠహారకనకకృత్సంయోగవాహీరసః. 1
శుష్కేంధనమహారాశిం యద్వద్దహతి పావకః,
తద్వద్ధాతుగతాన్ సూతోరోగాన్దోషత్రయోద్భవాన్.

తా. పాదరసము షడ్రసములతోఁ గూడినదై త్రిదోషశమనకారిగను, ఆమసంబంధ దోషముల హరింపంజేయునదిగను, కామమును వృద్ధిచేయునదిగను, కడుబలకారిగను, అమృతతుల్యముగను, శివస్వరూపిగను, చక్షురింద్రియమునకు ప్రకాశము గలుగంజేయునదిగను, స్మృతి, రూపము,వీనినిగలుగంజేయునదిగను, మృత్యువును, ముదిమిని, వీనిని జయించునదిగను, శరీరవృద్ధి గలుగంజేయునదిగను, జాడ్యము, క్రిమి, కుష్ఠువు వీనిని హరింపంజేయునదిగను కాంతిని గలుగం జేయునదిగను, అనుపానములచే సమస్తరోగములను నశింపజేయునదిగను నుండుటయేగాక, అగ్ని యెండినకట్టెల సమూహమును దహించుమాడ్కి ధాతుగతత్రిదోషంబులను దహించును.

### 62. హింగులోత్థరసము.

జంబీర నింబనీరేణ మర్దితం హింగుళం దినమ్.
ఊర్ధ్వపాతనయంత్రేణ గ్రాహ్యస్సాస్యన్నిర్మలోరసః,
కంచుకై ర్నాగవంగాద్యై ర్విర్ముక్తో రసకర్మణి. 1

తా. ఎనిమిదితులముల యింగిలీకమున్నునిమ్మపండ్లరసము,పారిజాతము ఆకురసము బాడిసెఆకు రసములతో ఖల్వమున నాలుగుజాములు మర్దించి యెండనెండించి పిదప దాని నొకగట్టికుండలోనునిచి పైన మఱియొకకుండ బోర్లించి చీలమన్నుచేసిన ఇదే ఊర్ధ్వపాతన యంత్రమనఁబడును. గా

...చే రెండుజాములు వండుటయేగాక పైకుండమీఁద తడిపినవస్త్రమును చు... దానిపై కొంచెము కొంచెముగ శీతోదకమును పదేపదే ప్రోక్షించుచుండ...లయును. ఇట్లుచేసిన నారసము పైకుండకెగసి ధూమాకారముగవ్యాపించి...యుండును. పిదప నాయూర్ధ్వపాతనయంత్రమును సాంగశీతలమునగ్రహిం... చీలమున్నను బహుజాగ్రత్తగదీసి పైకుండలో ధూమాకారముగావ్యాపిం... యుండురసమును కరాకట్ట (వరాహకూర్చ్చతో) గీచుచుండిన నందు రసము...వించును. పిదప ఆరసమును నాలుగుమార్లేని, అయిదుమార్లేని వస్త్రముతో ...డియుకట్టిన నది నాగవంగాదిసప్తకంచుకదోషరహితంబగును. ఇట్టిరసమును ...రౌషధములయందు నుపయోగింపందగును.

## 63. రసశుద్ధిక్రమము.

జంబీరోత్థద్రవేణైవ పారిభద్రద్రవేణవా,
యామం సమ్మర్ద్యయత్నేన రసోగ్రాహ్యస్సునిర్మలః. 11

తా. పైరసమును ఖల్వమునవైచి యొకజాముదనుక నిమ్మపండ్లరసముచేత ...నేని, పారిజాతపత్రరసముచేతనేని, మర్దించి యెండవెండించిన శుద్ధియగును.

వాక్యమ్ ఊర్ధ్వపాతనాదివిశిష్టపారదే నపుంసకత్వముస్తి
తదుక్తం శోధనసంస్కారే తస్మాత్,
బలప్రకర్షాయచడోలికాయాం
స్వేదోఽయ్యరసస్సైంధవచూర్ణగర్భే. 12

తా. ఊర్ధ్వపాతరసములకన్నిటికిని నపుంసకదోషము గలదు. అది ...వృత్తించుటకై యొకకుండలో సగము నీళ్ళుబోసి అందొకసేరు సైంధవ...ణమును నూరి కలిపి దృఢమయిన వస్త్రమును నాలుగుమడతలుగ మడిచి ...యందు నింగిలీకరసము నునిచి దారముతో గట్టిగ మూటగట్టి దానిని పైసైం...ధవలవణముజలములో మునుఁగునటులకట్టి యందలి జల మిగురుదనుక అహో...రాత్రములు గాఢ మస్య మృద్వగ్నులచే డోలాయంత్రమున వండవల...యును. ఇదేప్రకారము రెండవదినమును వండవలయును. ఇట్లుచేసిన రసము ...ర్దోషమగును.

### 64. సామాన్యషడ్గుణబలిజారణము.

క్షుద్రభాండే రసంకృత్వా వాలుకాయంత్రమధ్యమమ్,
షడ్గుణం గంధకం తత్ర క్షిపేదత్వాల్పకం శనైః 13
తైలరూపో యథా గంధ స్తత్తోవతారయే ద్ద్రుతమ్,
సాంగశీతో దృఢోగంధే స్ఫోటయిత్వా రసం నయేత్. 14
సర్వరోగేషు దాతవ్యో రసోవ్యాధినిసూదనః,

తా. ఒకచిన్నకుండను ఇసుకతోనింపి, దాని మధ్యమున ఇంగిలీకరస ముగల వేఱొకచిన్నకుండ నునిచి పొయిమీఁదఁబెట్టి, మధ్య నునిచినకుం డయందలిరసముపై శుద్ధిజేసిన గంధకచూర్ణమును వేయుచుండవలయును. ఇ టులవేసినగంధకము కరిగినతోడనే మరల గంధకమును వేయవలయును. ఇ ట్లగున రసము ఆఱింతల గంధకమును భక్షించునట్లు చేయుటయె షడ్గుణ గంధక జారణ మనఁబడును. ఈరసము సమస్తరోగములయం దుపయోగించు టకు మిగుల శ్రేష్ఠమైనదని ఆయుర్వేదవేత్తలు వచించెదరు.

### 65. జారణఫలము.

సర్వపాపక్షయే జాతే ప్రాప్యతే రసజారణాన్. 15
తత్ప్రాప్తౌ ప్రాప్యమేవంస్యా ద్దివ్యజ్ఞానం ముక్తిలక్షణమ్,
యావద్దినానివహ్నిస్థో జారితే ధార్యతేరసః. 16
తావద్వర్షసహస్రాణి శివలోకే మహీయతే,

తా. రసజారణచే సర్వపాపక్షయంబును, భుక్తిముక్తులును, విశే షజ్ఞానంబును కల్గును. రసజారణనిమిత్తము, అగ్ని నెన్నిదినములు స్థాపించెద రో, వారికన్ని సహస్ర వత్సరములు శివలోకప్రాప్తియు గలుగునని పరమేశ్వ రుఁడు వచించెను.

దినమేకం రసేంద్రస్య యోదదాతి హుతాశనమ్. 17
ద్రవంతి సర్వపాపాని కుర్వన్నపి నలిప్యతే,

తా. రసమునం దొకదినము అగ్ని దానముచేసెడి నరుఁడు సర్వపాప విముక్తుఁడగును.

అజారయంతో యది హేమగంధౌ
వాంఛంతి సూతాత్ఫలముగ్రదారమ్,
క్షేత్రావన స్తాదపిసస్యజాతం
కృషీవలా స్తేభిమజశ్చయుందాః. 18

తా. ఏవైద్యుఁడు రసజారణమును చేయకయే దానిచేఁగలిగెడు మంచి ఫలమును మాత్రము కోరునో యట్టివాఁడు భూమియందు వి త్తనము వి త్తకయే ధాన్యఫలమును కోరునట్టి కర్షకుని (కాపువాని) చందంబున మందబుద్ధి గలవాఁడని యెఱుంగవలయును.

66. షడ్గుణగన్ధకజారణఫలము.

తుల్యేతు గన్ధకే జీర్ణే శుద్ధా చ్ఛతగుణో రసః. 19
ద్విగుణే గన్ధకే జీర్ణే సర్వథా సర్వకుష్ఠహా,
త్రిగుణే గంధకే జీర్ణే సర్వజాడ్య వినాశనః. 20
చతుర్గుణేతు సంజీర్ణే వలీపలితనాశనః,
గంధే పంచగుణే జీర్ణే క్షయక్షయకరో రసః. 21
షడ్గుణే గన్ధకే జీర్ణే సర్వరోగహరోభవేత్,
అనశ్య మిత్యు వాచేదం దేవీ శ్రీభైరవేస్వయమ్. 22

తా. రసమునకు సమముగ శుద్ధిజేసిన గంధకమును జీర్ణింపఁజేసిన నది శుద్ధరసముకంటె శతగుణంబు లధికముగనుండును. రసమునకు రెండింతలు జీర్ణింపఁజేసిన సర్వకుష్ఠవులను, మూడింతలు జీర్ణింపఁజేసిన సర్వరోగములను, నాలుగింతలు చేసిన వలీపలితంబులను, అయిదింతలు జీర్ణింపఁజేసిన క్షయరోగంబులను, ఆఱింతలుజీర్ణింపఁజేసిన సర్వరోగములను హరింపంజేయునని శివుఁడు పార్వతీదేవి కుపదేశించెను.ఆ మేరస ప్రభావంబునందును భైరవునికుపదేశించెను.

## 67. గంధకజాతిభేదములు.

చతుర్ధాగంధకః ప్రోక్తో రక్తః పీత స్సితోఽసితః,
ఉత్తమోఽరుణవర్ణ స్స్యాద్దాడిమీకుసుమ చ్ఛవిః. 23
మధ్యమః పీతవర్ణ స్స్యా చ్ఛుక్లవర్ణోఽధమస్స్మృతః,
రక్తో హేమక్రియాసూక్తః పీతశ్చైవ రసాయనే. 24
వ్రణాది లేపనే శ్వేతః కృష్ణపీత స్సుదుర్లభః,

తా. గంధకము - రక్త, పీత, శ్వేత, కృష్ణవర్ణములని నాలుగువిధములు. అందు దాడిమపుష్పమువంటి రక్తవర్ణంబు గలది ఉత్తమము. ఇది స్వర్ణాది ధాతుమారణంబుల కుపయుక్తముగ నుండును. పీతవర్ణముగలది మధ్యమము. దీని నమ్రసార గంధకమందురు. ఇది ఔషధములయం దుపయోగింప దగును. శ్వేతవర్ణముగలది అధమము. ఇది వ్రణాదిలేపనమునకు ప్రశస్తముగ నుండును. ఈచతుర్విధగంధకములలో కృష్ణపీతవర్ణములు దొరకుట దుర్లభము.

శుకపుచ్ఛసమః ప్రాయో నవనీతసమప్రభః. 25
మసృణః కఠినస్స్నిగ్ధో గంధక శ్శ్రేష్ఠ ఉచ్యతే,

తా. చిలుకపుచ్ఛమువంటివర్ణంబును, వెన్నవలె మృదువుగను, చిక్కని పాకముగలదియై, కఠినముగను, నునుపుగను, నుండెడి గంధకము శ్రేష్ఠంబని ఆయుర్వేద వేత్తలు వచించెదరు.

## 68. గంధకశుద్ధి.

లోహపాత్రే వినిక్షిప్య ఘృత మగ్నౌ ప్రతాపయేత్. 26
తప్తేతప్తే తత్సమానం ప్రక్షిపే ద్గంధకం రజః,
విద్రుతం గంధకం జ్ఞాత్వా దుగ్ధమధ్యే నిధాపయేత్. 27
ఏవం గంధకశుద్ధిస్స్యా త్సర్వకార్యేషు యోజయేత్,

తా. లోహపాత్రములో కొంత గంధకచూర్ణమును, నేతిని వైచి నిప్పు
మీఁదనుంచి కరిగించి, పిదప శేషించిన గంధకచూర్ణమును అందు వైచి యది

ద్రవించినతోడనే దానిని ఆవుపాలలోఁబోసిన శుద్ధియగును. ఇట్టి గంధక మును సర్వౌషధములయందు నుపయోగింపందగును.

## 69. ధాతు సంఖ్య.

కనక తారక తామ్రక తీక్ష్ణక త్రపుభుజంగకమారక మేవచ,
ఇతివదంత్యపిధాతుగణంబుధాస్సకలశాస్త్రము తేష్యతివిస్తరాత్

తా. సువర్ణము, వెండి, తామ్రము, లోహము, ఇనుము, సీసము, వంగము అనునవి ధాతుగణంబులని ఆయుర్వేదవేత్తలు శాస్త్రములయందు వక్కాణించెదరు.

## 70. సువర్ణసంఖ్య.

ప్రాకృతంసహజవహ్ని సంభవం
హ్యాకరోద్భవర సేంద్ర వేధజమ్,
హేమ పంచవిధమాహు రాదరా
ద్బాలబోధన విధాన కారణాత్. 29

తా. "ప్రాకృతము," "సహజము," "అగ్నిసంభవము," "ఆకరోద్భవము," "రసేంద్రవేధము," అని సువర్ణము నైదువిధములుగ బాలబోధార్థమై చెప్పఁబడియెను.

## 71. సువర్ణ పరీక్ష.

యద్ధేమతప్తం శుచి వహ్ని యోగా
చ్ఛీతంసురక్తం యదివాకరస్థం,
గ్రాహ్యంచ శుభ్రత్వ మధోభ జేద్య
త్త్యాజ్యంసువర్ణం భిషజాంపరైస్తత్. 30

తా. అగ్నిలో కాచిన నే సువర్ణము శీతలముగను, ఎఱుపువర్ణము గలదిగను ఉండునో యది "ఆకరోద్భవ" మని యెఱుంగవలయును. దీని నౌషధములయందు గ్రహింపందగును. అగ్నిలో కాచిన శుభ్రవర్ణముగలదిగ నుండు సువర్ణము నౌషధములయందు వర్జింపవలయును.

## 72. సువర్ణ శుద్ధి.

త్రైలే తక్రే కాంజికే ధేనుమూత్రే
కౌలత్థానాం సంతపాయేర్కదుగ్ధే,
హేమంశుద్ధి ర్జాయతే కాంచనారే
తప్తంతప్తం దాహయేత్సప్తవారాన్. 31

తా. సువర్ణపురేకులను అగ్నిలోతప్తముచేసి తైలము, మజ్జిగ, పు
కడుగు, గోమూత్రము, ఉలవకట్టు, జిల్లేడుపాలు, కాంచనారరసములలో
ప్రతిదానియందును ఏడేడు మార్లు ముంచిన నది శుద్ధియగును.

## 73. సువర్ణ మారణము.

తపనీయరసో భుజంగమస్య రసకేవై విమ రేపిషోడశాంశే,
సహచామ్లజలేనచూర్ణ మేతత్పరిదృష్టావ్శుభగోలకోవిధేయః
సుశరావపు టేపిగోంతుల్యశుభగన్ధః పరిగోల మోచనీయః, అధ
రోత్తమాశుసంపుటాస్యంపరిరుద్ధ్వా పరిపాచయేత్సునఃహాన్. 3
దృషత్రింశవనోపలాన్సుశుష్కాఃపరిదేయాన్సతతంపు టేపుటేచ,
అపిసప్తపుటైన్సు శుద్ధిమేవంపరిసంజాయతఏవ హేమభస్మ. 3

తా. సువర్ణమును రాపాడి చేసి మంచిఖల్వమున వైచి, దానికి పద
శాంశము తమలపాకురసము, చింతపులుసు, కొంచెముగ నెల్లికాయల పులుసు
వైచి, నూరి ఉంటచేసి దానికి సమముగ శుద్ధిచేసిన గంధకమును గ్రహిం
చి చూర్ణముచేసి యొక మూసలో సగము గంధకమును వైచి, దానిపై యా
ఉంటనునిచి దానిపై శేషించిన గంధకము వైచి, పిదప దానిమూతిని చిల్ల
పెంకుచేమూసి చీలమన్నుచేసి యెండించి, పిదప దీని నొక శరావముననునిచి
పచనము చేయవలయును. పిదప దాని నందుండితీసి మరల పైప్రకారముచేసి
ముప్పదియేడుపిడకలతో పుటంబిడవలయును. ఇట్లు ఏడు పుటంబులిడిన సువ
ర్ణము నిర్దోషముగ భస్మంబగును.

### 74. సువర్ణభస్మగుణము.

మృతం హాటకం దివ్యకాంతిం తనోతి క్షత శ్వాస కాస
క్షయం పిత్తవాతౌ, ప్రమేహగ్రహణ్యాతిసారంచ కుష్ఠం
జ్వరం హంతి చాఖండికందర్పదంచ. 35

తా. శుద్ధస్వర్ణభస్మముచే, గాయము, కాసము, శ్వాసము, క్షయము, వాతము, పిత్తము, ప్రమేహము, సంగ్రహణి, అతిసారము, కుష్ఠువు, జ్వరములు, శించుటయే కాక, దివ్యమైనకాంతియు మిగుల కామవృద్ధియుగలుగును.

స్వర్ణాం తిక్తం కషాయం మధురమతిపయః స్థాపనం కాం
తిదంచ, వృష్యం హృద్యంచ బల్యం రుచికర మఖిలంవా
గ్విశుద్ధిప్రదంచ. ఆయుర్దంవై పలీనాం హరణ మచిరతోనా
శనం దుర్విషాణామ్, రోగేశోన్మాదమాంద్యజ్వర పరిహార
ణం సర్వరోగాభినాశమ్. 37

తా. సువర్ణభస్మము చేదు, వగరు, మధురము గలదిగను, ముదిమిని రింపంజేయునదిగను, కాంతి, వీర్యవృద్ధి, మనస్సంతోషము, బలము, రుచి, చి బుద్ధి, వాక్పటుత్వము, ఆయుర్వృద్ధి గలుగ జేయునదిగను, ముదిమి, ష్టవిషము, ఉన్మాదము, జ్వరము మొదలగు సమస్తరోగములను శీఘ్రముగ రింపంజేయునదిగను నుండును.

### 75. పక్వగుణము.

స్వర్ణం విధత్తేఽఖిలరోగనాశం కరోతి సౌఖ్యం ప్రబలేంద్రి
యత్వమ్, శుక్రస్య వృద్ధిం బల తేజ వృద్ధిం క్రియా సుయు
క్తించ యుతంచ హేమమ్. 38

తా. దోషరహితమగు సువర్ణభస్మము సమస్తరోగ నాశనంబును, ఇం ద్రియములకు దృఢత్వమును, శరీర సౌఖ్యమును, శుక్ర బల తేజోవృద్ధులను మస్త శోధనాది క్రియలను జేయును.

### 76. అపక్వదోషము.

బలంచ వీర్యం హరతేనరాణాం రోగవ్రజం పోషయతీహ
కాయే, అసౌఖ్య కారశ్చ సదైవ హేమ్నః అపక్వదోష
స్మరణం కరోతి.

తా. దోషముగల సువర్ణభస్మ సేవనచే బల వీర్యముల నాశనంబును, శరీరమున రోగప్రాబల్యంబును, సదా అసౌఖ్యంబును, మరణంబును గలుగును.

### 77. రౌప్యభేదములు.

త్రివిధంపరికీర్తితంచ రూప్యం ఖనిజం వంగజ వేధజే తథైవ,
అవలోక్యరసోదధీంశ్చగ్రన్థాన్ సకలై ర్వైద్యవిశారదైశ్చ.

తా. రౌప్యము, ఆకరోద్భవ, వంగోద్భవ వేధోద్భవము లని త్రివిధంబులుగ నుండు నని రసోదధి అను గ్రంథముల నవలోకనజేసిన వైద్యోత్తములు వచించెదరు.

### 78. రౌప్యపరీక్ష.

ఉభే వంగజం వేధజం చైవ గ్రాహ్యం యతో వై సు శుభ్ర
త్వమేకం మృదుత్వమ్, అతో గ్రాహ్యమేవం ఖనిస్థంచ
రూప్యం తతశ్శ్వేతవర్ణం నకోమాల్యయుక్తమ్. 41

తా. వంగజ వేధజము లను నీరెండురౌప్యములు కోమలముగను, శుక్లవర్ణముగను, నుండుటంజేసి యవి గ్రాహ్యంబులుగ నుండుననియు, ఆకరోద్భవము కోమలముగనుండక శ్వేతవర్ణముగ నుండుటంచేసి యది అగ్రాహ్యమనియు, వైద్యవేత్తలు వచించెదరు.

### 79 రౌప్యదోషము.

తాపో రోధో భ్రాంతి వాంతౌచ రూప్యే దోషాహ్యేతే
శోధనం కీర్తయిష్యే, తైలే తక్రే సంక్షిపే త్కుంభితో
యే తప్తం వారా న్మూత్రవర్గేచ సప్త. 42

తా. రౌప్యమునకు సంతాపము, రోధము, భ్రాంతి, వమనము, అను ...ర్విధదోషంబు లుండుటంజేసి యవి హరించుటకై దానిని అగ్నిలో తప్త ...చేసి మానెలో, మజ్జిగలో, గుమ్మడురసములో, చింత తేనెరసములో, మూత్రములలో, నేడేడుమార్లు ముంచవలయును. ఇట్లు చేసిన దోషముపోవును.

## 80. రౌప్యమారణము.

తారపత్రసమసూతగంధకే కాంజికేన సహి తేవి లేపయేత్, గర్భగుప్త ఉభయంత్ర కేక్షిపే త్పాచయే చ్ఛశిదినేను వహ్నినా.

తా. పైనిజెప్పినట్లు శుద్ధిజేసిన వెండిని పలచని రేకులు చేసి పిదపవా...తో సమముగ శుద్ధిచేసిన పాదరసమును, శుద్ధిజేసిన గంధకమును జేకొని, ...ంజికముతో నూరి, ఆవెండి రేకులకు దళముగ లేపనముచేసి, యెండించి, ...ల్కాగ్నితో పాకము చేసినను, లేక, పిడకలతో గొప్ప పుటంబిడినను, ...స్మమగును. పిదప దీనిని యిత్తెఱంగుననే నాలుగుమార్లు చేయవలయును.

## 81. రౌప్యభస్మగుణము.

తారంచ తారయతి రోగసముద్రపారం దేహస్య సౌఖ్య కృదలం పలితాపహంచ, హంతీహ రోగ విషదోషమలం ప్రసహ్య వృష్యం పునర్నవతరంకురుతే చిరాయుః. 44

తా. శుద్ధరౌప్యభస్మము సముద్ర సమానం బగు రోగంబులను, ముది ...ని, దోషయుక్త మగువిషములను, రోగములను దోషములను నశింపజేయు ...ను. శరీర సౌఖ్యంబును, మిగుల బలంబును, చల్లదనమును, వీర్యవృద్ధిని గలు ...గజేసి చిరకాలమునఱకు జీవించియుండునట్లు చేయును.

తారం రోగసముద్రపారగ మహో పిత్తాపహం వాతజి ద్గుల్మశ్లేష్మవిషా ర్తిమేహశమనం త్శుత్కాంతిసంధాయకమ్, శ్వాసప్లీహ యకృద్వలీపలిత జిత్పాణ్డ్వార్తిశోకాపహం కా సక్షీణ క్షతక్షయ ప్రశమనం దీర్ఘాయుషం పుష్టిదమ్. 45

తా. రౌప్యభస్మము సముద్రమువంటి రోగములనుండి తరింపఁజేయు దగినదిగను, పిత్తము, వాతము, గుల్మము, శ్లేష్మము, విషబాధ, ప్రమేహము, వాపు, శ్వాస, ప్లీహము, యకృత్తు, ముదిమి, పాండురోగము, శోకము, కా క్షీణత్వము, గాయములు, క్షయరోగము నశింపంజేయును. ఆయుర్వృద్ధి, శరీరపుష్టిని గలుగఁజేయును.

### 82. అపక్వదోషము.

తారంచ దేహస్య కరోతి తాపం విడ్గంధతాం యచ్ఛతి
శుక్రనాశమ్, అపాటవం వీర్యబలప్రహానిం మహాగదా
న్పోషయతీహ కాయే. 46

తా. శుద్ధిచేయని వెండిభస్మముచే శరీరమున జ్వరతాపము, మలమునంబోల దుర్గంధము, శుక్రక్షయము, దౌర్బల్యము, వీర్యహాని, రోగప్రాబల్యముగలుగును.

### 83. తామ్రసంఖ్య.

మ్లేచ్ఛంచ నైపాల మథోవదంతి శుల్బం రసజ్ఞా ద్వివిధం
రసేషు, యత్తాలనా చ్ఛ్యామతమాచశాంతీ స్తత్తామ్రకం
మ్లేచ్ఛకమాన హేయమ్. యత్తాలనా ద్రక్తతమాచకాంతి
ర్నైపాలకం గ్రాహ్య మథోభిషగ్భిః, అతఃపరం తామ్రస
మాశ్రితాంశ్చ దోషాంశ్చ వక్ష్యే బహుధాం శ్లోకైః. 48

తా. తామ్రము మ్లేచ్ఛ, నేపాళ జనితములని ద్వివిధంబులుగ నుండునని రసజ్ఞులగు వైద్యవేత్తలు వచించెదరు. అందు ప్రక్షాళనము జేసియు విగుల శ్యామవర్ణముగ నుండునది మ్లేచ్ఛజాతియనియు, రక్తవర్ణముగ నుండునది నేపాళదేశ జనితమనియు పలుంగును. అందు కడపటిది శ్రేష్ఠముగనుండుటచే దానిని గ్రహింపఁదగును. ఇఁక తామ్రము నాశ్రయించియుండెడి సర్వదోషంబులను అనేక శాస్త్రముల నవలోకించి వచించెదను

### 84. తామ్రదోషము.

వాంతి ర్భ్రాంతి స్సంక్లమ స్తాపశూలే కండుత్వంవై రేచ

తా వీర్యహాంతా, అష్ట దోషాః కీర్తితా స్తామ్రమధ్యే
తేషాం సర్వం శోధనం కీర్తయిష్యే. 49

తా. తామ్రమున వాంతి, భ్రాంతి, సంక్లమము, తాపము, శూల, కండు
...వము, విరేచనము, వీర్యహాని, గలుగంజేసెడు అష్టవిధదోషంబు లుండుటచే
...హరించుటకై చేయఁదగిన శుద్ధిక్రమము వచించెదను.

## ౪౯. తామ్రశుద్ధి.

తక్రం తైలం ధేనుమూత్రంచ వాంతిం భ్రాంతిం హన్యా
త్కాంజికం కౌలధామ్భః, వజ్రీ దుగ్ధం ధేనుదుగ్ధం క్లమం
య త్తాపం హన్యా త్తింత్రిణీ నింబతోయమ్. 50

తా. తామ్రపురేకులను నిప్పులో కాచి పుల్లమజ్జిగయందును, మంచినూ
...యందును, గోమూత్రమునందును, ఏడేడుమార్లు ముంచిన నందలి వాంతి
...షంబును, పుల్లనికలిలో, ఉలవకట్టులో, నేడేడుమార్లు ముంచిన నందలి
భ్రాంతి దోషంబును, బొంతజెముడుపాలలో, ఆవుపాలలో, నేడేడుమార్లు
ముంచిన క్లమదోషంబులు, చింతపండుపులుసులో, నిమ్మపులుసులో, నేడేడు
మార్లు ముంచిన నందలితాపదోషంబును హరించును.

శూలం హన్యా త్కన్యకా క్షీరతోయం హన్యా దుగ్ధం
గోఘృతం కండుతాంచ, రేచం హన్యా త్సైరణం మస్తు
తోయం క్షౌద్రం ద్రాక్షా వీర్యహాంతార మాశు. 51

తా. మఱియు తామ్రపురేకులను కాచి, మంచికలబంద, దిరిసెనపుపట్ట
...రసములలో నేడేడు మార్లు ముంచిన నందలి శూలదోషమును, ఆవుపాల
...లో, ఆవునెయ్యిలో నేడేడుమార్లు ముంచిన కండూదోషంబును, అడవికం
...రసములో, పెరుగుమీదినీళ్ళలో, నేడేడుసారులు ముంచిన విరేచనదోషం
బును, తేనెలో, పచ్చిద్రాక్షపండ్లరసములో నేడేడుసారులు ముంచిన వీర్య
హాని దోషంబును నశించును.

తప్తాని తప్తానిచ పత్రకాణి తామ్రస్య నూత్నాని విశో

ధస్యేద్వైవ, సప్తైవవారాంశ్చ పృథక్పృథగ్ద్రవతతః పరం
శుద్ధతరాణి నూనమ్. పత్త్రాణి తాన్యేవ సుఖల్వమధ్యే
ప్యర్ధేన సూతేనచ నింబతోయైః, విమర్దయే ద్దైవదృఢ
త్రిశ్చగాఢం గుణాన్వితశ్చైవతతరాణియావత్. 54

తా. తామ్రమును పలచని రేకులుచేసి అగ్నిలోకాచి తొలుత చెప్పిన
రసములలో ప్రతిదానియందు నేడేడుమార్లు ముంచిన శుద్ధియగును. పిదప
దానికి సమముగ శుద్ధిజేసిన పాదరసమును తామ్రపురేకులను ఖల్వములోవై
యా తామ్రపురేకులు తెల్లగ నగునట్లు నిమ్మపండ్లరసముచే జక్కఁగ మర్దిం
చుచుండవలయును.

సుశుద్ధగంధం ద్విగుణం సుమందం విమర్దయే ద్ధాన్యరసేన
సార్ధమ్, ప్రలేపయేత్తానిచ పత్త్రకాణి క్షిపే త్తతో దార్ఢ్య
యుతే సుభాండే. నిరుధ్య చాన్యేనశరావకేన ప్రపూరయే
ద్వాలుకయాచ భూత్యా, వహ్నిర్విదేయోఽథ శనైశ్శ
నైరైవ యామైశ్చతుర్భిర్మ్రియతేహి శుల్బమ్. 55

తా. మున్ను మర్దించి యుంచిన రేకులకు ద్విగుణముగ శుద్ధిజేసిన గం
ధకమును ధాన్యామ్లరసముతో జక్కఁగమర్దించి, తామ్రపురేకులకు లేపన
చేసి, యెండించి, ప్రమిదలయందుంచి, చీలమన్నుచేసి, యొకదృఢమైన కుం
డలో నిసుక, బూడిద పోసి, దానిమధ్యమున చీలచేసినదాని నుంచి, నాలు
జాములు మెల్ల మెల్లగ పాకముచేసినచో తామ్రము చక్కఁగ భస్మమగును.

పిష్ట్వార్ధగంధేన పునశ్చ ఖల్వే సంభావయే త్పూరణజద్ర
వేన, ఏకందినం నిర్ద్రవలనోవిధేయశ్శరావకై రేవ గజాఖ్య
యంత్రే. తతోవిధేయాః ఖలు పంచభావాః పృథక్పృథ
క్తైశుభ పంచగవ్యైః, ఈమ ద్విదేయః ఖలు గంధకోప
పుటేపుటే నాత్రవిచారణీయమ్.

తా. పిదప నాతామ్రభస్మమును, దానికర్ధభాగము శుద్ధిజేసిన గంధ

మును ఖల్వమునవైచి, అడవికందరసముచే భావనచేసి, ప్రమిదలయం దుం చి, చీలమన్ను జేసి, ఒకదినము అగ్నియుండునటుల గజపుటం బిడవలయును. పిదప తాామ్రభస్మమును ఆవుపాలతో, పెరుగుతో, నెయ్యితో, గోమూ త్రముతో, ఆవుపేడరసముతో, ప్రత్యేక ప్రత్యేకముగ భావనచేసి, ప్రతిపుటం బునకు కొంచెముకొంచెముగ శుద్ధిజేసినగంధకమునుకలిపి పుటంబిడవలయును.

క్షౌద్రస్య ఖండస్య పుటోవిధేయ స్తతఃపరం శుద్ధతరం హి శుల్బమ్, మయూరికంఠాభమిదం యదాచే త్తత్తామ్రకం శుద్ధతమం వదంతి. యత్సేవితం చేద్వితనోతివాంతిం గోదు గ్ధకేనైవ విశోధయే త్తత్, కృష్ణామధూభ్యాం పరిసేవయే ద్వై గ్రీష్మం శరద్వంచ విహాయమానమ్. 59

తా. పిదప తామ్రభస్మమును తేనెతో, కలకండతో, పుటంబులిడి న నది పరిశుద్ధంబగును. మఱియు, మయూరకంఠవర్ణంబుగనుండు తామ్రభ స్మము పరిశుద్ధమయిన దని చెప్పంబడు. ఇట్టిభస్మంబును సేవించవలయును. ఒకానొకసమయమునం దధికముగ వమనలబు లయ్యేనేని దానిని మరల ఆవు పాలతో మర్దించి పుటంబిడి పిప్పలి, తేనె, వీని అనుపానములతో సేవింప వలయును. తామ్రభస్మమును గ్రీష్మశరదృతువులయందు సేవింపగూడదు.

### 86. తామ్రగుణము.

కుష్ఠ ప్లీహ జ్వర కఫ మరుచ్ఛ్వాస కాసా ర్తిశోషాం
స్తంద్రాశూలోదర కృమివమీ పాండు మోహాతిసారాన్,
అర్శో గుల్మక్షయ భగ్రను శిరోవ్యాధి మేహాదిహిక్కా
శుద్ధం శుల్బం హరతి సతతం వహ్నివృద్ధింకరోతి. 60

తా. శుద్ధతామ్రభస్మసేవనచే కుష్ఠువు, ప్లీహము, జ్వరము, కఫము, వా తము, శ్వాసము, కాసము, వాపు, తంద్ర, శూల, ఉదరము, కృములు, వాంతి, పాండువు, మూర్ఛ, అతిసారము, మూలవ్యాధి, గుల్మము, క్షయము, భగ్రము, శిరోరోగము, ప్రమేహాదిరోగములు, ఎక్కిళ్ళు నశించును. అగ్నిదీ పనము గలుగును.

